



# GITAM UNIVERSITY

**HYDERABAD CAMPUS**

Rudraram Village, Patancheru Mandal, Medak Dist – 502 329.

*City Office*: Progressive Towers, Khairatabad, Hyderabad-4


---

Date: 11-6-2014

**Press Release:**

## గీతంలో అడ్మిషన్ల కౌన్సెలింగ్ ప్రారంభం

### విద్యార్థులకు ధ్రువీకరణ పత్రాలను అందజేసిన డైరెక్టర్లు

గీతం విశ్వవిద్యాలయం విశాఖపట్నం, హైదరాబాద్, బెంగళూరు క్యాంపస్‌లలో ఇంజనీరింగ్, ఫార్మసీ, ఆర్కిటెక్చర్ కోర్సులలో ప్రవేశాల కోసం నిర్వహిస్తున్న ఆన్‌లైన్ కౌన్సెలింగ్‌ను బుధవారం హైదరాబాద్ ప్రాంగణంలో డైరెక్టర్ ప్రొఫెసర్ సీహెచ్.సంజయ్, రెసిడెంట్ డైరెక్టర్ డీవీవీఎస్ఆర్ వర్మలు లాంఛనంగా ప్రారంభించారు. సీఎస్ఈ విభాగంలో సీట్లను 403 ర్యాంకర్ జి.సాయిఫణీంద్ర భార్గవ, 707 ర్యాంకర్ సి.కృష్ణవంశీలకు కేటాయిస్తూ ధ్రువీకరణ పత్రాలను అందజేశారు. గీతంలో ఉన్న వనరులను సక్రమంగా వినియోగించుకుని మంచి విద్యను గరపాలని ఆ విద్యార్థులకు వారు సూచించారు.

అఖిల భారత స్థాయిలో జరిపిన ప్రవేశ పరీక్ష (గాట్-2014)లో అర్హత సాధించిన విద్యార్థులు ఆన్‌లైన్ స్లైడింగ్ పద్ధతిలో ప్రవేశాలు పొందనున్నారు. ఈనెల 16 వరకు హైదరాబాద్, విశాఖపట్నం, బెంగళూరు గీతం ప్రాంగణాలతో పాటు తిరుపతి, విజయవాడ, బెంగళూరు సిటీలలో ఈ ప్రక్రియ నిర్వహించనున్నారు. అలాగే ఎంటెక్, ఎంఫార్మసీ కోర్సులకు ఈనెల 18వ తేదీన మూడు క్యాంపస్‌లలో కౌన్సెలింగ్ ద్వారా ప్రవేశాలు కల్పించనున్నారు.

కాగా తొలిరోజు కౌన్సెలింగ్‌ను ఉదయం 8.30 గంటలకు ప్రధాన కేంద్రం విశాఖపట్నంలో ఆరంభించి, తొలుత ఎస్సీ, ఎస్టీ, అంగవికలాంగ అభ్యర్థులకు ప్రవేశాలు కల్పించారు. తొలిరోజున 1 నుంచి 5,000 ర్యాంకుల వరకు సీట్లు కేటాయించారు. 12వ తేదీన 5,001 నుంచి 9,000 వరకు, 13న 13 వేల వరకు, 14న 17 వేల వరకు, 15న 26వేల వరకు, 16న 30 వేల ర్యాంకుల వరకు సీట్లు కేటాయించనున్నారు.

ఈఐఈ విభాగాధిపతి, కౌన్సెలింగ్ సమన్వయకర్త ప్రొఫెసర్ పి.శ్రీహరి, అడ్మిషన్స్ డిప్యూటీ డైరెక్టర్ ప్రొఫెసర్ నారాయణరావు, అసిస్టెంట్ డైరెక్టర్ వై.శ్రీనివాస్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.


P.R.O.,

GU Hyd. Campus, 94 94 65 66 77


<u>ఫొటో రైటప్:</u>

డీఎస్సీ0222: సాయిఫణీంద్ర భార్గవకు సీఎస్ఈ విభాగంలో సీటును కేటాయిస్తూ ధ్రువీకరణ పత్రాన్ని అందజేస్తున్న హైదరాబాద్ క్యాంపస్ డైరెక్టర్ డాక్టర్ సీహెచ్.సంజయ్, రెసిడెంట్ డైరెక్టర్ డీవీవీఎస్ఆర్ వర్మ, కౌన్సెలింగ్ సమన్వయకర్త ప్రొఫెసర్ పి.శ్రీహరి, అడ్మిషన్స్ డిప్యూటీ డైరెక్టర్ ప్రొఫెసర్ నారాయణరావు తదితరులు

డీఎస్సీ0226 : కృష్ణవంశీకి సీటును కేటాయిస్తూ ధ్రువీకరణ పత్రాన్ని అందజేస్తున్న గీతం డైరెక్టర్లు